సం॥ర చందా 1-0-0 (పోస్టేజితో సహా) Regd. M. N. 3766

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

## విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 40 | ఏలూరు, 15 జూన్ 1951. | సంచిక 3

## నిత్యసంకీర్తనము

**వివరణము :**

మన మొకవిత్తనమును నాటునపుడు దానిలో జీవకళ కనుపట్టదు. దానిలో జీవమున్నదని యెఱుంగుదుము, గాన జాగ్రత్తగ నాటి, నీరుపోసి, కాపాడుదుము. అది మొలకెత్తును. అపుడు మన యాశ లభివృద్ధిజెందును. దానిలో జీవముండుటచేతనే యంతటి జాగ్రత్త వహించుచున్నాము. అట్లే మన జీవిత విషయమునుగూడ మనలో జ్ఞానము లేశమాత్రమే యుండుఁగాక. కొంచెమే యెఱుంగుదుము గాక. దానిని క్రమ క్రమముగా నభివృద్ధిపఱచుచో నది పెద్దదై మన యాశయముల నెఱవేర్చును.

**సంకీర్తనము :**

హే విశ్వవ్యాపీ! నీ దయారసమునకు నేను బాత్రుడ నగుదును గాక!
నా జీవితమునకు నూతన వికాసము నొసంగుము.
నా బలమంతయును నీవే కదా ?
నా చిత్తమును నీ చిత్తముతో నేకీభవింపఁజేసి నీ యడుగుల ననుసరింతునుగాక !

— స్వామి రామతీర్థ.

# మన దేశము

రచయిత :
శ్రీ. పి. సూర్యనారాయణ పట్నాయక్.

బాలకులారా ! భారతవీరకుమారకులారా!
స్వతంత్ర పౌరశిఖామణులారా !
వీరశివాజీ పుట్టిన దేశం
బాలచంద్రుడు మెసలిన దేశం
చంద్రగుప్త పురుషోత్తము లాదిగ
వీరుల గాంచిన ప్రసిద్ధ దేశం
స్వతంత్రదేశము మనదేనోయ్ !
స్వతంత్రులము మనమేనోయ్ 1

స్వతంత్రసీమను చేయబూనుకొని
అహింస మంత్రము జపించుకొంటూ
కుతంత్రదాస్యము కూలగ ద్రోసిన
స్వతంత్రభారత వీరశిఖామణి
గాంధిమహాత్ముడు జననమొందిన
పవిత్రదేశము మనదేనోయ్ ! 2

బాలభక్తు లగు ధ్రువమార్కండులు
ప్రహ్లాదాదులు బాలయోగులు
ప్రకాశరూపులు భగవద్భక్తులు
భారతవీరులు భవ్యచరిత్రులు
భక్త కబీరు బమ్మెరపోతన
శ్రీనాథాదులు త్యాగరాజులు
యశములు గురిసిన పవిత్రదేశం
భక్తులు పాడిన పావనదేశం
స్వతంత్రదేశము మనదేనోయ్ ! 3

గంగా గౌతమి జీవనదులతో
బంగరుపంటలరాసులతో
అడిగినవారికి లేదనకుండ
అన్నము పెట్టిన అమృతప్రదేశం
విశ్వము నేలిన పెద్దదేశము
స్వతంత్రదేశము మనదేనోయ్ !
స్వతంత్రులము మనమేనోయ్ !

మనదేశభాగ్యమును – మనదేశధర్మమును
మనదేశపద్ధతుల – మనదేశసాహితిని
పోషించుట మనకర్తవ్యం
ప్రజలనుదిద్దుట మనధర్మం
విద్యలు నేర్పుట మీకు శుభం. 4

---

# విత్తు

బాలబంధు, పోలాకి శ్రీనివాసరావు

దీనిభావము తెలియు మోబాలా !
దీనిభావము తెలిసి విత్తుల
పూని నాటగవలెను బాలా !

విత్తు వేయగ
మొలక మొలిచెను
నీరు పోయగ వేళ్లు సాగెను
శాఖ లెన్నో జనించి ప్రాకెను
వృద్ధిగల యొకవృక్ష మయ్యెను
పలువిధంబుల ఫలిత మొసగెను
గాలివానకు నేల గూలెను ||దీ||

వంటచెఱకై ఇంటికలపై
చాల రకముల సాధనాలై
బ్రతికి చచ్చియు బహువిధంబుల
విలువ జూపెను వింతవిత్తు.

# ప్రాచీన వృత్తివిద్యా విధానము

శ్రీ శీలా వెంకటప్ప

భారతదేశంలోపూర్వకాలమునుండియుఒక్కొక్క వృత్తి నవలంబించేవారు, కులమను పేర నొక్కొక్క సంఘముగ నేర్పడియుండినారు. నేటికులములు సాధారణముగ వృత్తుల ననుసరించి యేర్పడినవే నని చెప్పవచ్చును. ఒక్కొక్క కులమువారు ఒక్కొక్క విద్యను పోషిస్తూ యుండినారు. ఈ విద్యలకే కుల విద్యలనియు, వృత్తి విద్యలనియు, పేరు. వృత్తి విద్యలను నేర్పేటందుకు పూర్వం మనదేశంలో నేటి వలె విద్యాలయాలుగని, కళాశాలలుగాని, లేకుండా ఉండినాయి. అప్పుడు మనదేశంలో ఆయాకళలందు ఆరితేరిన వృత్తి విద్యా విశారదులు, తమ కులములందలి బాలురకు వృత్తి విద్యను ప్రసాదించేవారు.

నాటి వృత్తి విద్యాబోధకుల కుటీరములే వృత్తి విద్యాలయాలు (Work Shops) గా ఉండెడివి. అందు భక్తి శ్రద్ధలు, వినయవిధేయతలు, గలబాలురు తమ గురుకులాన్ని రంజింపజేసి. తమకు కావలసిన వృత్తి విద్యను పరిగ్రహించేవారు. దీక్షవహించి గురువులను ఆనంద పరచేవారు. గురుకుటీరాల్లోనే విద్యార్థులు స్వానుభవముగ వృత్తి విద్యను నేర్చడంచేత, తమ జీవయాత్రను సౌఖ్యముగా గడపేవారు. విజ్ఞాన భాస్కరులైన గురువర్యులు యేవృత్తి యందుండినా సరే, యెక్కడుండినాసరే, అక్కడికేగి విద్యను ఆర్జించే వారునాటిబాలురు. తండ్రి దగ్గర కొడుకు నేర్చుకొనీ, అన్నదగ్గర తమ్ముడు నేర్చుకొనీ, శిష్యత్వం ఆచరించేటంతకాలం గురుశిష్య సంబంధమే కానీయితరంలేదు. ఏదైనఉంటే యెడమైన తర్వాతనే ఏతత్సంబంధాన్నిబట్టే వృత్తివిద్యలన్నియు వంశక్రమానుసారముగ వస్తూ, ఒక్కొక్క కులమువారు కట్టుబాట్లకులోనై, కులవిద్యనుతప్ప యితరము నేర్చకుండిరి. నేర్చినంత మాత్రాన కులద్రోహానికి అంటగట్టేవారు.

ప్రాచీన భారతంలో యెన్నోవృత్తులు అలరారుతూ యుండేవి. ప్రతిభాసంపదగలకర్మకారులు ఆయావృత్తులను కొనసాగిస్తూ, కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించేవారు. ప్రతి వృత్తియు చాలగౌరవ భావంతో చూడబడేది. నాటిగ్రామసీమల వృత్తి విద్యానిపుణులు హైందవ నాగరికతకు, హేతుభూతులుగా యుండి, ఖండాంతరము లందుగూడ భారతావనికి శాశ్వత యశోధనాన్ని కూర్చినారు. మనకులవృత్తులను కళాకుసుమములుగా వికసింపజేసి, దేశాంతరములందు కూడ వెదజల్లేవారు. నాటిమన పల్లెటూరి వృత్తి విద్యానిపుణులు. మనప్రాచీనా వృత్తివిద్య అంత మహోన్నతమైనది: అంతఉత్కృష్టమైనది.

నాడు మనప్రాచీనవృత్తి విద్య అంతమహోన్నత దశలో వుండేందుకు కారణం యేమి? అందుకు ఒక్కటే కారణం. ప్రభువుల ఆదరణ; ప్రజాదరణ విశేషంగా వుండేది. ప్రతి గ్రామంలోవుండే కుమ్మరి సాలె, కంసాలి, శిల్పి, కమ్మరి, చిత్రలేఖకులు, మొదలగువారికి వివిధములగు వృత్తిమాన్యములను, ప్రత్యేకములగు కొన్ని స్వాతంత్ర్య గౌరవములనే కాక, భూములు మొదలైనవి బహుమతులుగా నిచ్చినట్లు చరిత్రమును బట్టి తెలుస్తున్నది. ఆయా నేర్పులకు కళాపోషకులగు ప్రభువరేణ్యులు అశోకుడు, శ్రీ కృష్ణ రాయలు, అక్బర్, షాజహాన్, మొదలైనవారు తమ కొలువు కూటముల కాహ్వానించి... వారిచేత ప్రత్యేకములైనవృత్తివిద్యా గ్రంథములు వ్రాయించేవార నియుఅందుకు ప్రతిఫలంగా వివిధ బహూకృతుల సమర్పించేవారనియు. గతచరిత్ర చాటుచున్నది.

ఇంతయేల? నాటి ఆగ్రా తాజ్ మహల్, అజంతా అమరావతి, మహాబలిపురం, హంపీ కట్టడముల శిల్ప కళాభిరతికిని, ఢక్కామల్లునేత నగిషీకిని, విదేశీయులైన చరిత్రకారులే భారతీయవృత్తి విద్యా విశారదుల కళానైపుణ్యాభి రతికినీ, ముగ్ధులై, భారతభూపతుల కళాపోషణకు జోహారులర్పించిరి.

ఏదియేమైన నాడు మనదేశీయులైన ప్రభు వరేణ్యులు భారతీయవృత్తి విద్యా విధానమును సక్రమ మార్గాన పోషిస్తూ. ఆదరిస్తూ యుండినందున నేవృత్తి విద్యాచార్యులు కళాదేవతను ఉపాసించి అందచందాలతో ప్రాచీన భారతఖండాన్ని ఖండాంతరములందుకూడ సగర్వంగా తలెత్తుకొనేటట్లు చేయగలిగినారు. మనప్రాచీనావృత్తి విద్యఅట్టిది. అంతమహోత్కృష్టమైనది. ఆదర్శనీయమైనది. అట్టిపోషణ ఆదరణ, నేడు గావలసియున్నవి.

# బావగారి పెళ్ళి



బాలకవి:
పి. వి. శీతారామశాస్త్రో — పాచిపెంట,

భలే! భలే! బావగారు !
బాగుగా తయారయారు !
సూటు బూటు వేసినారు !
హేటు తలకు బెట్టినారు !
బేటు చేతబట్టినారు !
నీటు గోటు చూపినారు !
టింగురంగ యనగ బావ
శీకు రాకుగాను బావ
పిల్ల నడుగ పట్టణంబు
వెళ్ళినారు వేడ్కతోడ.

*

బావగారిని చూచి వారు
భలే! మంచివా డనిరి
పిల్లదాన్ని చూచి బావ
పెళ్ళి కిష్టపడె నండి
యీడు చక్కగ నుండెనని
యిష్టపడిరి బంధుజనులు
వెయ్యి నూట పదహారులు
పెళ్ళికొడుకికి కట్న మనిరి
ఒప్పుకొనిరి అత్తవారు
తప్పకుండ పెళ్ళికి.

*

ఇంతలోన వచ్చెనండి
ఎచటనుండో ఉత్తరంబు
బావగారిని చదువు మని
బంధువు లుత్తర మీయ
ఇటూ అటూ జాబు త్రిప్పి
యేడ్చినాడు చదువురాక
బావగారి యేడ్పు జూచి
బంధువులెల్ల రేడ్చినారు
చావు ఉత్తరం బనుకొని
బావురుమని యేడ్చినారు.

*

గడుసుకుఱ్ఱ డొకడు వచ్చి
కార్డుచదివి "క్షేమ" మనుచు
ఎందు కేడ్చినా రటంచు
యెలమి నూరడించె వారి
చదువురాక బావగారు
చక్కగేడ్చిరని గ్రహించి
ఒక్కుమ్మడి బావగారి
ముక్కుపట్టి నులిమినారు
కఱ్ఱతోడ పెళ్ళిచేసి
వెఱ్ఱిబావ నంపినారు
బావగారి వలెనుగాక
బాగుగాను మీరు చదివి
ఎల్లవారు మెచ్చునటుల
పిల్లలార! మెలగుడీ!

[బావగారి పేరు తెలీదు. అంతా బావగారంటారు. వచ్చే నెలలో చక్కనికథ మరొకటి]

# గురుభక్తి

రచన:
శ్రీ చక్రాల తిరుపతిరాజు.

(దేశమును ప్రేమించుమన్నా అను మాదిరి)

గురువులను ప్రేమించుమన్నా!
విద్యలను నేర్పించుమన్నా!
పట్టుబట్టి చదువుకోవోయ్!
గట్టిగా నీవు బాగుపడవోయ్! 1

నిరక్షరాస్యత నిర్మూలించితె
భావిదేశము బాగుపడునోయ్!
విద్యగలిగితె నీతిగలదోయ్!
నీతిగలవాడేను మనిషోయ్! 2

ఈ నిరక్షరాస్యు లుంటే
భారతావని బాగుపడదోయ్!
తెలుసుకొని భవితవ్యమున
నీ దేశవిద్యల నింపవోయ్! 3

అన్నిగ్రామాల్ క్రమ్మవలెనోయ్!
విద్యాలయంబుల నింపవలెనోయ్!
విద్యలన్నియు నేర్చితే నీవు
భావిపౌరుడ వౌదువోయ్! 4

ఆలసించిన లాభమేమోయ్!
ఐక్యవిద్యల నందుకోవోయ్!
అడుగుజారిన నిలువలేవోయ్!
అంధకారము అలముకొనునోయ్! 5

చూపు శ్రద్ధను విద్యలందే
గౌరవము నీ గురువులందే
అశ్రద్ధ విద్యలో చూపబోకోయ్
సత్యదీక్షను నిలుపవోయ్. 6

విద్యాభిమానం నాకుకదని
వట్టిడంబాల్ కొట్టకోయ్
పూనికతో నీ బిడ్డలను
విద్యాలయంబుల జేర్పవోయ్. 7

ఒజ్జలంటే ఓర్పుకోవోయ్
ఒరులవలె నీవు చూడబోకోయ్
పల్లెఒజ్జల బ్రతుకుతెరువులు
గాంచితే నీవు ఘనుడవోయ్. 8

గురుని స్వేచ్ఛల కోర్వలేని
నరుని కెక్కడ పరువుగలదోయ్
ప్రజలబిడ్డల శ్రేయమునకై
సేవజేసిన శ్రేయమౌనోయ్. 9

నీ స్వలాభమె నీచ మనుకొని
విద్యాభివృద్ధికి తోడుపడవోయ్
బోధనంటే మాటగాదోయ్
నిజ బోధకులె నీ గురువులోయ్. 10

గ్రామస్థులందరు ఐక్యముతో మీ
గ్రామబడులకు వెళ్లవలెనోయ్
జాతిమతముల జాడలరయక
అన్నికులములు కలిపి జేర్చోయ్. 11

కులం వేరైతేను యేమోయ్
విద్యనేర్పెడి ఒజ్జలుంటే
చెలిమియన్నది నేర్చుకోవోయ్
చెలగి ముందడుగేయగలవోయ్. 12

విజ్ఞాన మనియెడు ఓడనడిపే
చుక్కానియౌ నీ గురుని చూడోయ్
నిలకడగ నీవు నిలచి చదివితే
జీవయాత్రలో జయము నీదోయ్. 13

ఎన్నికష్టములైన ఓర్చియు
విజ్ఞానబీజము వేయవలెనోయ్
ఆ బీజములు మొలకలెత్తితే
దేశాభిమానము తేజరిలునోయ్. 14

గురువులను ప్రేమించుమన్నా!
విద్యలను నేర్పించుమన్నా!

# విశాలాంధ్రంలో ప్రాథమికోపాధ్యాయుల అగచాట్లు

శ్రీ జె. యస్. ఆర్. కృష్ణమూర్తి.

స్వతంత్రం వచ్చింది. పారతంత్ర్యం పోయింది. ఉపాధ్యాయుల సమస్యలుమాత్రము యథాతథంగా నిలిచియున్నవి. ఉపాధ్యాయుడు పారతంత్ర్యములో నోరు మెదపలేక క్రుంగాడు. స్వాతంత్ర్యం సిద్ధించిన భారతావనిలో ఉపాధ్యాయుడు నేడు క్రుళ్ళు చున్నాడు. జీవితమునకు చీకటివెలుగులుంటవి. కాని ఉపాధ్యాయుడు ఎల్లప్పుడును నైరాశ్య తిమిరంలో నేదిక్కూతోచక సతమతమౌతున్నాడు. ఇందులకుగల యథార్థమైన కారణం ఏమిటి? ఈనాడు ప్రాథమికోపాధ్యాయుడు పల్లెలలో జీవయాత్ర సాగిస్తున్నాడు. దేశ సౌభాగ్యమునకు పల్లెలే పట్టుకొమ్మలు. అట్టి పల్లెలు ఈనాడు ఎంత దుస్థితిలోయున్నవో విజ్ఞులు ఎరుగనిదికాదు. అందు వసించు ఉపాధ్యాయుడు ఎట్టి విపరీతపరిస్థితులలో జీవితయాత్రను కొనసాగిస్తున్నాడో తెలియనివారు లేరు. దేశంలో మహా నాయకులు విశ్వ వ్యాపితమైన అనేక సమస్యలను తీసుకొని వానిని బాగుపరచడానికి యత్నిస్తారు గాని, ఉపాధ్యాయుని పురోభివృద్ధినిగురించి యిసుమంతయైనను ప్రోత్సహించి మాట్లాడరు. కనీసము ప్రయత్నించినట్లు అగపడరు. అసలు ఉపాధ్యాయుల సమస్యలు ఏమిటి? ఉపాధ్యాయుడు ఎల్లప్పుడును సంఘజీవియే. పూర్వము సంఘంలో ఉపాధ్యాయునకు ప్రముఖస్థానం ఉన్నదంటె ఆనాటి ప్రజలు, ప్రభువులు, ఉపాధ్యాయులను పోషించెడి వారు. ప్రభుత్వములు ఏర్పడి, పాలకులు బయలు దేరిన తదుపరి వీరికి జీతములంటూ ఏర్పాటు చేశారు. జీతములు ఎప్పుడయితే ప్రవేశపెట్టినారో ఉపాధ్యాయునకు ప్రజలనుండి ఆర్థికలాభము నశించింది. ఉపాధ్యాయుడు స్వయంపోషకుడు కావలసిన స్థితి వచ్చింది. పాశ్చాత్యులహయాంలో నెలకి రు.8నుండి 18 రూపాయలవరకుగూడ ఉపాధ్యాయునకు వేతనమిచ్చి చాకిరి చేయించుకొన్నారు. ఈ స్వాతంత్ర్య యుగంలో రు. 25 నుండి 27ల వరకువచ్చి నిలిచింది. ఈ కనీసభృతిలో వ్యక్తి జీవించేది ఎట్లా? ఉపాధ్యాయుడు బ్రహ్మచారిగాడు గృహస్థుడు. గృహస్థుడైనాడంటే పిల్లకాయలు, కలగడం సహజమే. యీ కొద్దిజీతంతో తాను జీవించి, తనమాదిరిగనైనను తన సంతానమును పైకి తేవాలనే యిచ్ఛ యీ భూమిమీద వసించెడి తిర్యగ్జంతువుమొదలు మానవునకుసహిత ముంటుంది. ఆర్థికపరిస్థితులు సడలిన యీ దినములలో ఉపాధ్యాయుడు ఏ విషయంలోను ఆదర్శంగా నిలవలేకపోతున్నాడు.

సమస్యలు :—

(i) ఆర్థికంగా ఉపాధ్యాయుడు తొలుదొల్త బాగుపడాలి అంటే యీనాటి ఆహారపదార్థములు, వస్తువుల ధరలు, మండుచున్నవి. గ్రామసీమలలో యీనాడు ప్రభుత్వము ఉపాధ్యాయులకిచ్చు జీతములతో కాలము గడువగు. క్షుద్బాధ భరింప శక్యముగానిది. పదేపదే యీవిషయమును గూర్చి అనేకపర్యాయములు మెమోరాండములు సమర్పించుకొన్నా ఫలితం ఏమాత్రము కలుగలేదు. యీనాటి నాయకులకు యీ విషయం తెలియకపోలేదు. ఓర్పువహించుట చాల కష్టతరంగా యున్నది. తిరుగుబాటు వచ్చినపుడీ విషయమును గమనింతురు గాక!

(ii) **A** ఉపాధ్యాయులు-హక్కులు:- ఉపాధ్యాయుల సర్వీసు కండిషనులు చాల అధ్వాన్నపరిస్థితులలో యున్నవి. ఒక చదువుచదివిన వ్యక్తికి ఏ మేనేజిమెంటులో నున్న ఒకేవరము ప్రసాదించాలి. ఉదా:- సెకండరీగ్రేడు ఉపాధ్యాల విషయయంలో చాల ఘోరమగు అన్యాయం జరుగుతోంది. యిటీవల కృష్ణాజిల్లాబోర్డులో సెకండరీ ఎడ్యుకేషన్‌లో పనిచేయుచున్న ఉపాధ్యాయులకు గవర్నమెంటు స్కేళ్లను 1-4-51 నుండి అమలులోపెట్టిరి. అంటే సెకండరీ స్కూలులో వర్కుచేయు సెకండరీగ్రేడు ఉపాధ్యాయునకు రు. 45-3-60-2-90 స్కేలు మీద జీతం ప్రారంభమౌతుది. అదే మేనేజిమెంటులో ఎలిమెంటరీ పాఠశాలయందు పని చేయు ప్రాథమికోపాధ్యాయుడు-అంటే సెకండరీగ్రేడు టీచరుయొక్క స్కేలు రు. 40-1½-55-2-75 యీ రెండుస్కేళ్లలోని తేడాను చదువరులు గమనింతురని

నా మనవి. కనీసపుజీతములో రు. 5-0-0 వ్యత్యాసం. యింక్రిమెంటు విషయంలో రు. 3-0-0 ఎక్కడ రు. 1-8-0 ఎక్కడ? ఒకే చదువుచదివి, ఒకే మేనేజిమెంటులో పనిచేయుచున్న ప్రాథమికోపాధ్యాయులపై యింత చిన్నచూపా? ప్రభుత్వం ఎలిమెంటరీ పాఠశాలలో పనిచేయు సెకండరీగ్రేడు ఉపాధ్యాయుల విషయము ఏమాత్రము ఆలోచించినట్లే అగపడదు. సమానత్వము లేనినాడు సౌభ్రాతృత్వము ఎట్లు గలుగును? సెకండరీ పాఠశాలలో 5 సం॥లు పనిచేస్తే రు. 60 లు గిట్టుతుంది. ఎలిమెంటరీ పాఠశాలలో 14 సంవత్సరములు చెమటోడ్చి పనిచేస్తే రు. 61-0-0 గిట్టును. 5 సంవత్సరములు ఎక్కడ? 14 సంవత్సరములు ఎక్కడ? యింతటి తీవ్రమగు వ్యత్యాసమునకు ప్రాథమికోపాధ్యాయులు చేసిన దోషమేమి? పనిఏమైనా తక్కువ చేస్తూన్నారా? లేదు. Secondary స్కూలులో 180 రోజులుచేస్తే Elementary స్కూలులో 220 రోజులు చేస్తున్నారు. Secondary School లో ఉపాధ్యాయుని జీతమునకు, పిల్లల హాజరునకు, సంబంధంలేదు. Elementary School లో యీనాడు జిల్లాబోర్డులో పనిచేయుచున్న ఉపాధ్యాయునకు కనీసపు హాజరు 30 వుండాలి. పిల్లలకొరకు యిండ్లవెంబడి కాలుగాలిన పిల్లిలాగా తిరగాలి, తిరగకపోతే స్థానభ్రష్టత కలుగక తప్పదు. కృష్ణాజిల్లా బోర్డులో ఎలిమెంటరీ సెక్షనులో పనిచేయు సెకండరీగ్రేడు ఉపాధ్యాయులెల్లరును యీవిషయమును గూర్చి జిల్లాబోర్డు ప్రెసిడెంటువారి దృష్టిగా తెచ్చి తద్వారా కలుగులాభములను పొందెదరని ఆశించెదను.

B:- ఉపాధ్యాయులు - ఎన్నికలు:- సెకండరీ స్కూలులో 3 సంవత్సరములు సర్వీసుకల్గి పనిచేయు ఉపాధ్యాయులకు రేపు వచ్చే ఎన్నికలలో ఓటు చేయుటానికిఅధికారం కలదు. అంటే Secondary-Grade ఉపాధ్యాయులకు కూడ ఆ అవకాశమివ్వబడినది. పోతే, ప్రాథమిక విద్యాలయములలో పనిచేయుచున్న Secondary Grade పంతుళ్ళ విషయం ఏమికావాలి? ప్రాథమిక విద్యాలయములలో పనిచేయువారు ఉపాధ్యాయులుగారా? వారికి సర్టిఫికేట్లు లేవా? వారుచదువుచెప్పుటలేదా? వారు భారతపౌరులుగారా?. కాన సోదరోపాధ్యాయులెల్లరును యీ విషయమును సెంటరుక్లాసు మీటింగుల ద్వారా తగు ఆందోళనజరిపి రేపు జరుగు ఎన్నిక పట్టీలలో మనపేర్లుగూడ నమోదగు వరకు నిరంతర కృషిజరిపి తీరాలి!

(iii) ఉపాధ్యాయులు — క్రొత్తసర్టిఫికేట్లు — ఈనాడు ఉపాధ్యాయులు విధిగా క్రొత్తసర్టిఫికేట్లను పొందియుండాలి, లేకపోతే ఉపాధ్యాయుల జీతములనుండి రు. 5 ల మినహాయింతురు. ఉపాధ్యాయులకు ఏవైనా రిఫ్రెషర్‌కోర్సులలో ఉత్తీర్ణులు కావాలంటే దానిపూర్తిబాధ్యత ప్రభుత్వమే వహించాలి, అంటే అందులకు అయ్యే ఖర్చంతా ప్రభుత్వమే భరించి వారిని సుశిక్షితులను చేయాలి. యీనాడు క్రొత్తసర్టిఫికేట్లకు అంటే కబ్ మాష్టర ట్రయినింగ్‌కు, ఫస్టు ఎయిడ్ కోర్సుకు స్పిన్నింగ్ కోర్సుకు, ఉపాధ్యాయులు వారి స్వంతధనమును వెచ్చించి, మరింత ఋణగ్రస్తులగుచున్నారు. Secondary Schools లోని ఉపాధ్యాయులకు 'సిటిజన్‌షిప్' ట్రయినింగ్‌ను ప్రభుత్వపు ఖర్చుతోనే యిప్పించుచున్నారు. అవిధముగనే ఎలిమెంటరీ స్కూలులోని యుపాధ్యాయులకు గూడ యీ క్రొత్తట్రయినింగ్ శిక్షణను ప్రభుత్వపు ఖర్చుతో నొసంగిన యెడల, ఆర్థికంగా వెనుకబడిన ఉపాధ్యాయులకు తరుణమునకు మంచి సాయము చేసిన వారు అగుదురు.

(iv) ఉపాధ్యాయులు-అదనపుసౌకర్యములు:— యిటీవల పశ్చిమగోదావరి జిల్లాబోర్డులో పనిచేసే ఉపాధ్యాయుల బిడ్డలకు ఉచిత విద్యాసౌకర్యమును కల్గింతురని చేసిన ప్రకటనను చూచి చాల సంతసించితిని. ఉపాధ్యాయులు అసలు ఆర్థికంగా చాలహీనస్థితిలో యున్నారు గాన వారిపిల్లలకు ఆయినను కనీసము ఉచిత విద్యాసౌకర్యములు గలుగజేయవలెను. ఉచిత విద్యాసౌకర్యములు గలుగజేసినయెడల, ఉపాధ్యాయునకు కొంత మన స్థిమితము చేకూరినట్లే యీనాటి పరిస్థితులలో యిది తక్షణం జరుగవలసిన విషయం.

(v) ఉపాధ్యాయులు-గృహవసతులు:- ఈనాడు పట్టణ ప్రజలను చూచి పల్లెలలోగూడ యిండుకట్టి అద్దెల కిచ్చుచున్నారు. పల్లెలలో అద్దెకుండేవారు సర్వసాధారణముగ ఉపాధ్యాయులే గాన వారు యీకొద్ది జీతములలోనే యింటిఅద్దెలు విపరీతంగా భరించవలసివచ్చుచున్నది. ఉదా:-రు 5 ల నుండి పైననే యున్నదిగాని దిగువన అంటే రు 1, 2, 3 లకు ఎవ్వరు యియ్యడంలేదు. గాన ప్రభుత్వం ఉపా

ధ్యాయులకు యింటిఅద్దెలను కూడ యివ్వవలసి యున్నది.

అసలుదేశము బాగుపడాలంటే ఉపాధ్యాయుని స్థితి ముందుబాగుపడాలి. దేశము అంటే ప్రజలు అట్టి ప్రజలను విజ్ఞానవంతులుగా, చేసేవాడు వారినిగూర్చి ప్రథమంలో పలు యిక్కట్లు పడేవాడు ప్రాథమికోపాధ్యాయుడు. అట్టి ప్రాథమికోపాధ్యాయుడు నేడు తన జీవితమును సక్రమముగా సాగించుకోవడానికి పలుపాట్లు పడుతున్నాడు. యీనాటినాయకుల ముఖ్యకర్తవ్యం ఏమిటంటే ప్రజలను విజ్ఞానవంతులను చేసే ప్రాథమిక బడిపంతుళ్ల యొక్క ఆర్థికస్థితిని చక్కదిద్దుటయే. వారి సమస్యలను తక్షణం పరిష్కరించుటయే,

---

# గ్రాంటుబడుల టీచరు మేనేజర్ల కష్ట జీవితము

ఒకానొక ప్రభుత్వమందేకాదు - ఒకానొకదేశమందేగాదు-తుదకు విశాల ప్రపంచమందుకూడా ప్రభుత్వ అంతర్భాగమనిపించుకోగల సర్వసంస్థలందు కూడా ప్రభుత్వానికి, ప్రజలకు మధ్యను మధ్యవర్తులుగా కొందరు మేనేజరులని, మేయర్లని, ప్రసిడెంటులని, ఇంకా యేవేవో హోదాలతో వుండుటన్నది పరిపాటయి పోయింది. ఎట్లంటే మిల్లుమేనేజరులని, బస్సువోనర్లని చెఱువుగోడ్ల కంట్రాక్టుదారులని, జిల్లాబోర్డు ప్రెసిడెంట్లని మున్సిపల్ చైర్ మేన్లని కార్పొరేషన్ మేయర్లని తుట్టతుదకు ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు టీచరు మేనేజర్లని, యనబడుచున్నారు. ఈమధ్యవర్తిత్వములు కేవలము ప్రభుత్వవ్యయాన్ని తగ్గించుకు నేయుక్తి. ఇది పరాయి ప్రభుత్వమునాటి స్వార్థపరమావధి. ఈ గ్రాంటు పాఠశాల మేనేజరు సాధారణముగా తానొక టీచరే అయివుంటాడు. ఈయన జిల్లాబోర్డు ప్రసిడెంటుగారిని మెప్పించే పెద్దమనుష్యుల సహాయమునుకోరి వారికగు ట్రయినులేదా, బస్సులేక స్పెషల్ కారు ఛార్జీలు, విపరీతమైన రహదారి భత్యాలు, యిత్యాది మహాఖర్చులు కనీసము ఒక వందపర్యాలు పెట్టుకోలేకనో, లేదా వారు కోరినపుడెల్ల తగినలాంఛనాలతో తఱచు దర్శన మీయగల భయముచేతనో, లేక టాన్స్ఫరుకు ప్రయత్నిస్తే తిరిగి ఎపాయింటుంత వ్యయప్రయాసలు పడలేకనో, లేక శలవులు పెడితే, జీతానికి మూడింతలు ఖర్చయితేనేగాని ఆకొస్తఛరణము రాదనో, లేక గుమస్తాలను తఱచు కలుసుకోకపోతే ఏక్షణములోనైనా తనకు స్థానచలనము వస్తుందనో. సోదరస్థానికోపాధ్యాయు లనుభవించుపై విపరీతములు చూచి వెఱగందియో కొంతమంది ఉపాధ్యాయులుగల ఒకబడికి మేనేజరయ్యాడు.

అయితే తాను టీచరు మేనేజరయి ఏమిసుఖపడాలి? ప్రావిడెంటుఫండు బోనసులు తన స్వంత నిధినుండి కట్టాలి. ఆపనపు గ్రాంట్లు ప్రభుత్వాదేశానుసారము నిర్బంధముగాయిచ్చి తీరాలి. పైసర్దుబాట్లకు ఏమైనా రాబళ్లు వున్నాయంటే పురాతన గురుకులాశ్రమ కాలమునుండివచ్చుచున్న ఆయాచారమే నేడు లేదు. బడిజీతాలు శాశ్వతముగా వసూలు చేదామంటే ఈ పని శాశ్వత బడిబిడ్డల హాజరుపై ఆధారపడి వున్నది.

కానీ ఈ లాంటి ఎలిమెంటరీ స్కూళ్ల యాజమాన్యాన్ని సాగిస్తున్న జల్లాబోర్డు ప్రసిడెంటేమైనా తన స్వంతసొమ్ము ఖర్చుచేస్తున్నాడా అంటే అదీ లేదు. చక్కటి రాబడులు వసూలుచేసి ఉపాధ్యాయుల కిస్తున్నాడేగాని మొలను గట్టిన కాసైనా స్వంతంగా వెచ్చింపడు. అయితే ఎయిడెడ్ ఏజన్సీల నుండి జిల్లాబోర్డులకు పోయే రాబడులు ఎయిడెడ్ స్కూళ్ల అభ్యున్నతికి చేరవేయ్యాలి. ఇది చక్కటి న్యాయము. పోనీ పురపాలక సంఘాధ్యక్షు డేమైనా తన స్వతంగా విద్యనుగూర్చి ఖర్చుచేస్తున్నాడా అంటే అతనుకూడా పురములో కావలసినన్నిపన్నులు వసూలుచేసి తన యాజమాన్యాన్ని సాగిస్తున్నాడే గాని తమలపాకు బీడికైనా ఖర్చుచేసిన పాపాన పోలేదే! ఇదిగాక పాశ్చాత్యుల యాజమాన్యమును జూడబోదామంటే వాళ్ల మిషన్ ఫండువుండగా గుళ్లు కట్టనీ, గోపురాలు నిర్మించనీ, బీదకుటుంబీకుల వద్ద కూడా వసూలుచేసి దొరగా రనిపించుకొంటూన్నాడే గాని యితడుగూడ చిల్లిగవ్వ స్వంతంగా ఖర్చుచేసిన పాపాన పోలేదు. ఇవన్నీ యిట్లుండగా ఖుద్దు గవర్నమెంటువారిచేనడపబడే పాఠశాలలను యించుక తిలకిద్దాము. ప్రభుత్వములోచేరినఅధినేతలంతా ప్రభుత్వ

నిధినుండే ఖర్చుచేసి వారి యాజమాన్యాన్ని సాగిస్తున్నారేగాని, ఎయిడెడ్ యాజమాన్యములవలె బడి స్వయం పోషణకై తమ స్వంతడబ్బు అవంతకూడా వెచ్చించుటలేదు. పుష్కల ధనసంపదచే మెరయు ప్రభుత్వమే యివ్వనినాడు కుట్టూపిరితో నుండు మేనేజరులపై నేల యీ ప్రయోగమని నావినతి.

ఇదిగాక క్షేమమైన గ్రాంట్లు పంపకమున్నదని తనివిదీర వుందామంటే ప్రభుత్వానికి యిష్టమున్నంత మొత్తాన్నే యిచ్చునుగాని పూర్తిగా యివ్వవలసినంత బాధ్యతలేదు. బోర్డువారిపైనగాని, మున్సిపల్ వారిపైనగాని, ప్రభుత్వంపైనగాని, లేని కోతలు - అత్యధికారములు - కేవల మీ గ్రాంటు బడులకే పరీక్షాధికారుల కలానికి ప్రత్యేక కోతశక్తులిచ్చి కనికరములేకుండా యిట్టి కఱవు దినాలలో తక్కువ చదువుపై కట్టనీ, ప్రొపోర్షనేట్ కట్టనీ, స్టాట్యూటరీ కట్టనీ, హెవికట్టనీ, స్పెషల్ కట్టనీ, అన్ట్రయిండు టీచరుకు ఆల్ కట్టనీ, ఏవేవో లెక్కలేనన్ని కోతలు కోయిస్తున్నారు. ఇట్టి గ్రాంట్లతో ఏమిటింటామో ప్రభుత్వమాలోచించాలి.

ఇది ఇట్లుండగా రత్తుణగ్రాంటు చక్కగ వస్తుందంటే దానికి లెక్కలేనన్ని గండాలున్నాయి. లైబ్రరీలేదనీ, నీళ్ళకుండలు బాగులేవనీ, గార్డెన్ యింకను ఎక్కువ చేయలేదనీ, చుట్టు కంచె కట్టించలేదనీ, బోర్డులకు రంగు చాలదనీ, బెల్ అండ్ బోటు సరిగా వాగలేదనీ, వాచీకి పెండ్యులము కంపను చాలదనీ, కుర్చీలకు యింకా బిగింపులు చాలవనీ, యేవేవో సాకులుపెట్టి ఆ గ్రాంటు కోతలూకోస్తున్నారు. ఈ గ్రాంటు కొన్ని బడులకు పూర్తిగను, మరికొన్నింటికి సాధారణముగను, యింకా కొన్నింటికి తుదకు బడికి రిజిష్టరుకు పెట్టిన పెట్టుబళ్లుకూడా పూర్తిగా యివ్వకుండా, ఎత్తివేయబడుచున్నవి. ఇట్లే నా జిల్లాబోర్డు, మునిసిపల్, మొదలైన సంస్థలకు ధనసహాయము చేస్తూన్నది? ఇట్టి లోపాలు స్థానిక పురపాలక సంస్థలలో లేకపోలేదు. అయినప్పటికి వారి కీవిధముగానే ధనసహాయము తగ్గిస్తున్నారా? అవి పెద్దసంస్థలు, వాటికేలోపాలున్నా తప్పులేదు కాబోలు!

ఈ మధ్యను మాబోర్డు సోదరోపాధ్యాయులో లేక మున్సిపల్ ఉపాధ్యాయులో మరి యెవరోగాని ఎయిడెడ్ యాజమాన్యములోనుండు స్కూళ్లు చక్కగలేవనీ, లోపాలతోనిండి యున్నవనీ, చిన్న గ్రామాలలో కూడా ఎయిడెడ్ స్కూళ్లు స్థాపింపబడుతున్నాయనీ, లెక్కలేనంతమంది టీచరులందుంటారనీ, ఏవేవో వారివారి కలాలకుగల సత్తువల్లా చూపి వ్రాశారు. ఈ వ్రాతలకు వారు పనిచేయు సంస్థలెంతేని మెచ్చుకోగలవు. అయితే ఎయిడెడ్ స్కూళ్ళవలె బోర్డు స్కూళ్లు కూడా కుగ్రామాలలో ఏల నెలకొల్పబడలేదు? నెలకొల్పినను తగు ఉపాధ్యాయ బృందమందేలయుండదు? బోర్డుపాఠశాలలు ఎత్తివేయబడే స్థలాలలో ఎయిడెడ్ స్కూళ్లు స్థాపింపబడి బాగున్నాయే? బోర్డుస్కూళ్ళలో తగిన ఫర్నిచరుగాని, తగిన ఉపకరణాలుగాని, సరిగా లేనేలేవే? ఎయిడెడ్ వారి కట్టి అనర్థమున్న గ్రాంట్లు సరిగా రానేరావుగదా! ఈ నిబంధనలుబోర్డుయాజమాన్యములకులేవా? చెప్పండి. బోర్డులో పేరుపడ్డ ఎలిమెంటరీ లేక హయ్యరెలిమెంటరీ బడులు మా ప్రాంతమందుగాన లేకున్నాను. ఎయిడెడ్ లో పేరెన్నిక గన్న బడులు లెక్కలేనన్ని వున్నాయి, ఓపికపట్టి చూడవచ్చు. మా ప్రాంతములో చూపిస్తాం, బోర్డు యాజమాన్యము బాగులేదని ప్రయివేటు మేనేజిమెంటు ఆక్షేపించుటగాని, ఎయిడెడ్ మేనేజిమెంటు బాగులేదని బోర్డువారాక్షేపించుటగాని, యేమంత మంచి పనికాదు.

ఇంతకు అంతిమ వినతి యేమంటే ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూళ్లనుగూడ సమదృష్టితో నాంచి సాటి సంస్థలకున్న సర్వ సదుపాయములు వీటికి తక్షణమే ప్రసాదించమనియే. గత నష్టమును గుర్తించి శాశ్వతముగా అదనపు గ్రాంట్లు ప్రభుత్వమే భరించి సత్వరమే యివ్వాలి. ఈ బడులను ఏకారణము చేతనైనా భ్రమపడి బాధ్యతా రహితమైన స్థానిక సంస్థలపాలు చేయకుండా అవసరమైతే ప్రభుత్వమే స్వాధీనము చేసుకొని నడపాలనీ, లేదా అదనపు గ్రాంటులిచ్చి ఇప్పటివలె ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూళ్లను నిలపాలని నా మనవి.

పక్కి— సత్యనారాయణమూర్తి.

# సూక్తులు



(రవీంద్రుని 'STRAY BIRDS' లోని ఆంగ్లమాతృకల ఆధారంతో)

సౌఖ్యమున్ విడి ఓర్వ్యజాల నీజగతి
సౌఖ్యమ్ము విడనాడి చన నెంచునోయి!

●

పెడదెసన్ కాగడా వెలుఁగఁబో వారు
ఎడల తమముందె నిలుపువా రోయి!

●

ఎపుడెట్టు లేమౌనొ ఎరుగ_జీవింతు
అపురూపమై తోచు నెపుడు జీవితము.

●

ఆరగింపక నీకు ఆకలి లేక
ఓరెమున్ దూరె దీవూర కదేల?

●

మను వనుగ్రహమూని మనుగడ నొసగ
మనసు కీర్తుల మనన్ మనుపగా వలదె?

●

వినయమే అనయమ్ము విబుధమార్గమ్ము!
ఘనత గౌరవములన్ గాంచు మార్గమ్ము!

●

మొలకె త్తినవి నీ ముద్దుపాదాలు
అలముకొన్నవి భువి నణగార్చి తృణము!

●

తప్పిదంబు జయంబు తప్పిపో నోపు
ఒప్పిదంబు జయంబు నొసగంగ పొసగు!

●

పేర్మి గరిమ మీర విభుజేరు యువతి
ధర్మపత్ని అనఁగ తార్కాణ మోయి!

●

చులుకార చొఱబారు ఛురికతో నొఱసి
ఒఱ తనలో దాచ నోడబడ దోయి!

●

చూచుదాని దెలుప చులకనా గాక
చూచుదాని నిజము చులకనే తెలియ!

●

గొప్ప నిర్భయముగ కొద్దితో నడచును
సరస మదియు దూర మరుగుచుండు!

●

నటియించు మంచుకణాల పట్టునటు
గూటి నీగిల పట్టుకొనును సాలీడు!

శ్రీ. జి. వి. ఎ. నరసింహారావు,
జాతీయసమితి—నాగులపాడు.

# కావాలోయ్! కావాలి!!

ఆర్. సుబ్రహ్మణ్యం - టీచరు - గంగలకుర్తి - అగ్రహారం.

రైతుకు పొలము
పొలముకు బలము
దున్నగ హలము
కావాలోయ్! కావాలి. 1

తిండికి కంచము
పండగ మంచము
కొలతకు కుంచము
కావాలోయ్! కావాలి. 2

విద్యకు గురువు
బాలకు చదువు
ఊరికి చెఱువు
కావాలోయ్! కావాలి. 3

విద్యార్థికి కథలు
పంతులుకి ఆంధ్రరాష్ట్రప్రారంభవిద్య
తెలుగువారికి ఆంధ్రరాష్ట్రము
కావాలోయ్! కావాలి. 4




౧

ఆర్యా !

ఆలంబజారు ఆంధ్ర ప్రైమరీస్కూలునకు జూట్ ఫ్యాక్టరీవారు క్రైస్తవమిషనరీకిసంబంధించిన ఫాస్టరునకు మేనేజిమెంటు యిచ్చుటవలన అతడు హిందూ క్రైస్తవ ఉపాధ్యాయులను నియమించి, హిందూ టీచరును ప్రధానోపాధ్యాయుడుగా ఏర్పరచి, పాఠశాల నడిపించుచున్నాడు. ప్రధానోపాధ్యాయునకు సర్వీసు యెక్కువైనను యోచించక తక్కువజీతమును, అసిస్టెంటుటీచరు క్రైస్తవుడగుటవలన హెచ్చు జీతమును యిచ్చుచున్నాడు. మరియు వాచకములలో క్రైస్తవపాఠములేతప్ప హిందూ పాఠములు కొన్నించుటలేదు. హిందూ బాలబాలికలతో క్రైస్తవ ప్రార్థనలు జరిపించుచున్నారు. యీవిధముగ మతాభిమానముతో మేనేజిమెంటుచేసి స్కూలు నడుపుటవలన తీరని కష్టము కలుగుచున్నది. హిందూ ఉపాధ్యాయునకు జీతము రు. 42 లు. పైమేనేజరుకు చాలదని విన్నవించుకొన నేనేమిచేయుదును? ఫ్యాక్టరీవారు గ్రాంటు హెచ్చించిన నేనేమి కాదంటానా? అనడమేకాని, అతడు ఫ్యాక్టరీవారికి నచ్చజెప్పి మాష్టర్ల యిబ్బందులను తొలగించుటకు ఉద్దేశింపడు. పంతులే ఫ్యాక్టరీవారిని ప్రార్థించినప్పటికి క్రైస్తవ మిషనరీని అడగమని సమాధానము. యిట్లు రెండిండ్లచుట్టువలె బాధపడుచున్నాము. ఈదుస్థితికి ఫ్యాక్టరీవారుగాని, గ్రామ ప్రజలుగాని, తగు చర్య తీసుకొనకపోయినచో ఉపాధ్యాయునకు ప్రాణాపాయస్థితియు, హిందూ బాలబాలికలకు క్రైస్తవమతస్వీకారమును కలిగితీరును. మరియు ఫ్యాక్టరీ ఆండలోవున్న ఒరియా, హిందూస్తానీ సెక్షనుల టీచరులయొక్క జీతముతో తెలుగుటీచరు జీతమును సరిపోల్చగా సగానికిసగము వ్యత్యాసము కలదు. కావున క్రైస్తవ మేనేజిమెంటువలన కలుగు యిక్కట్టులను ఫ్యాక్టరీవారు తొలగింపగలందులకు తమ పత్రికద్వారా ప్రార్థించుచున్నాము.

గుండపు అప్పారావు.
ప్రసిడెంటు :— సరస్వతీ ఆంధ్ర బాలభక్తసంఘము.
ఆలంబజారు—కలకత్తా.

౨

## నిర్బంధ ప్రాథమికవిద్య—

ఆర్యా !

"అన్నీ ఉన్నాయిగాని ఐదోతనమే లేద"న్నట్లున్నది మా స్కూళ్ళపరిస్థితి. మా వేణమ్మపేటలోని స్కూళ్ళేగాకుండా మా చుట్టుపట్లనున్న గ్రామాదులందు అనగా అక్కులుపేట, చింతలపేట, నెల్లిపర్తి స్కూళ్ళకు పై హంగులన్నీ ఉన్నాయిగాని, అసలుదేలేదు, అదే పిల్లలసంఖ్య లోపించటం.

మా గ్రామం, అక్కులుపేట, ఈ రెండుగ్రామాలలోకూడా ఎక్కువమంది చేనేతపారిశ్రామికులు; వ్యవసాయదార్లు. వీళ్ళకు వారివృత్తే ప్రధానంగాని చదువుసంధ్యలతో నిమిత్తంలేదు. పోనీ యెంతోశ్రమపడి పంతులు ఒక్కొక్కయింటికీ పదేసిసార్లు పిల్లల్ని పిలుస్తూ తల్లిదండ్రులను బ్రతిమాలితే ఎనమండుగురు పిల్లలు స్కూలులో ప్రత్యక్షం. వీళ్లకాపంతులు చదువుచెప్పటకు విసుగెత్తుతుంది. ఎటెండెన్సుకుమాత్రమే మీ లోపములేకుండా పూర్తిగా నింపేస్తారు. యింకా మిగతా రెండుగ్రామాల స్కూళ్ళలోకూడా మాలాంటిబ్రతుకే అయింది. ఆ గ్రామాల్లో అంతా రైతువారీబాపతు. వాళ్ళనేమైనాఅంటే పంతుళ్లకే

నష్టం. ఆఖరికి విసుగెత్తి ఏమయ్యా కుఱ్ఱవానిని బళ్ళోకి పంపించవేమని అడిగితే "చాల్లేవయ్యా, మావాడు చదివేసినంతలోనే చక్రవర్తి అయిపోడులే" అని సమాధానాలు వస్తున్నాయి. అధికార్లు వచ్చేసరికి సంజాయిషీ లిమ్మని వెంటనే అడుగుతారు పిల్లలు లేనందుకు. ఆఖరుకు ఏదో ఒక నెపం చూపెట్టి వచ్చే విజిటుకు తప్పకుండా ఎక్కువ హాజరు చూపిస్తానని సముదాయిస్తుంటారు. యీ కారణంవల్లనే మా స్కూళ్లలో రేంజీ మొత్తముపై "కట్" [Cut] లేని స్కూలేలేదు. మా పరిస్థితులు చూచేవారుగాని, వినేవారుగాని శూన్యం.

కాబట్టి ప్రభుత్వం మాయందు పరిపూర్ణకటాక్షం చూపెట్టి, మా గ్రామాలలోని స్కూళ్ళలో సత్వరం "నిర్బంధప్రాథమికవిద్య" అమలుజరపాలని యీ లేఖద్వారా కోరుతున్నాను.

మునగవలస రంగారావు పట్నాయక్,
టీచరు - వేణమ్మపేట.

3

## పాచిపెంట గ్రామానికి వయోజనపాఠశాల అత్యవసరం.

అయ్యా!

ఈ గ్రామము సాలూరుతాలూకాలోగల గ్రామము లన్నింటికంటె పెద్దగ్రామము. గృహసంఖ్య 1400. జనసంఖ్య 6000. ఇంత పెద్దగ్రామములో నిరక్షరాస్యులైన పెద్దలెందరో ఉన్నారు. పల్లెలలో విద్యాభివృద్ధి కుంటుపడియున్నందున అట్టి పల్లెలకు వయోజన పాఠశాలలు ఉండాలని వార్తాపత్రికలకుగూడ వ్రాసి పంపుకున్నాము. మా పాచిపెంటగ్రామములో ఆదర్శప్రాయమైన వయోజనపాఠశాలను స్థాపించాలని అధికార్లకు దరఖాస్తులుగూడ పెట్టుకొన్నాము. కాని ఫలితము శూన్యము. సాలూరుతాలూకా మొత్తం మీద యిట్టి పాఠశాలలు నెలకొల్పబడలేదు. ఓట్లరాజ్యంలో ప్రతివారికి చదువు వ్రాతలు ఆవశ్యకమని గుర్తించిన ప్రభుత్వం త్వరలోనే పల్లెలలో వయోజన పాఠశాలలను నెలకొల్పాలని ఈ లేఖద్వారా మనవి చేయుచున్నాను.

పాచిపెంట.
31—5—51.

పి. వి. సీతారామపాత్రో,
కార్యదర్శి—నవ్యోపాధ్యాయపరిషత్.

---

## వివేకప్రశ్నలు

పక్షివర్యుండు పరగు పంచాక్షరముల ;
వాని తలదీయ నొక కవివర్యుడగును ;
వాని తలగొట్టగా తులామానమగును ;
దాని తలదీయగా మహీజానియగును.

—టి. వేంకటేశ్వర్లు - టీచరు - దోరణాల.

పంటధాన్యము ; పేరు త్రివర్ణము లగు ;
చివరి రెండక్కరంబులు చేర్ప కత్తి ;
అది యంత్యాలు గలిపిన అగును భార్య ;
అట్టి పదమేదొ తెల్పుడు గుర్తెఱింగి.

—అల్లంరాజు బంగారం - విద్యార్థి - శంఖవరం.

---

లోకం తీరు:

# ఓటు విలువ

"యథార్థరాయుడు"

కోటి విద్యలు కూటికొరకే అన్నారు పెద్దలు — వేసిన వేషములన్నీ వుదర పోషణార్థమే!! అందులో ముఖ్యంగా "ఖద్దరు వస్త్రధారణం — గౌరవం — పరిపూర్ణం" కాబట్టి అన్ని వేషములలో బురఖావేషమే ఉత్తమం! ఉన్నతం!! ఉజ్వలం!!! యీ వేషమే నేడు యెక్కువగా చెలామణి అవుతుంది.

*　　*　　*

ఎలక్షన్లకి పదిరోజులు ముందుగా ప్రచారానికి బయలుదేరుతారీ వేషగాళ్ళు. క్షమించండి....అందరూ వేషగాళ్ళుకారు_కొందరు మాత్రమే! "మానవసేవే మాధవసేవ_నాకు ఉద్యోగంతో నిమిత్తంలేదు. కాని మీ వంటి ప్రజల నుద్ధరించాలని నిల్చుంటున్నాను. మీ ఓటు నాకే వెయ్యవలె" నంటాడొక పెద్దమనిషి- "నేను మీ సేవకుణ్ణి. మీ ఓటు నాకే వెయ్యండంటాడొక మహాశయుడు. "నాకు ఓటువేస్తే మిమ్మల్ని తారాపథాని కెగురవైచి చుక్కలరాజ్యానికి పట్టంగట్టి మీ యభీష్టములు నెరవేర్చుతా నంటా"డొక వ్యక్తి. "నా క్రింది అనుచరులు మీరంతా. నాకు ఓటువేయనిచో మీ పాట్లు చూచుకోండి" అని బెదిరిస్తాడింకొక ఆసామీ. "నేనే_మీరు. మీరే_నేను. బాగుగా గుర్తించుకోండి. మీకు ధనసహాయంకూడా చేస్తాను" అని ఆశను రేకెత్తింపజేస్తా డొకాయన.

*　　*　　*

నోట్లద్వారానో, మాటలమూలమునో అధికారరీతినో "మీఓటును మాకే వేయం డంటారు. ఎలాగైతేనేం! ఓట్లు సంపాదిస్తారు. లోకంతీరు యిలాగుంటుంది. అందుకే "లోకపుతీరూ తెలియగా లౌకికజ్ఞానం ప్రధానమోయ్" అని డడడా పాట ఆంధ్ర ప్రజానీకానికి అమూల్య సందేశాన్ని అందజేసింది. కాని;విద్యావిహీనులముందిట్టి పాటలు బధిర శంఖారవములే!! ఇయ్యది యథార్థం! ఇంతకీ ఓట్లరాజ్యంలో "ఓటు విలువ" నూటికి ద్బైభమందికి తెలియలేదంటేఅతిశయోక్తికాదు. "మీ ఓటు" మాకే వెయ్యండన్నవారుతక్క ఓటు విలువను బోధించే మహనీయు లరుదు. లేరు కూడా.

*　　*　　*

ఎట్టివానికి ఓటువెయ్యాలి? ఎవరికి ఓటువేస్తే దేశం బాగుపడుతుంది? వీనికి ఓటువేయడం మంచిదా? చెడ్డదా? ఇతడు దేశసేవకుడా? స్వార్థపరుడా? అను ప్రశ్నలు తమలోతాము వేసుకొని ఓట్లువేసే అక్షరాస్యులు స్వల్పము. నిరక్షర కుక్షులకు ఓటువిలువ తెలియదు. ఇయ్యదినిక్కువం, యథార్థం, తథ్యం, సత్యం !!!

"పడుగు రెటుపడేస్తే నానూ అటే పడేత్తా నంటాడొక మనకాలప్రభువు. లోకం తీరును, ఓటువిలువను గుర్తించక, అమాయకత్వానికి గురియై ఆలోచించకుండ ఓట్లను వ్యయపరచుచున్నారు. ఐతేవీరికి

(తరువాయి 74 పేజీ చూడుడు)

## మీ గోచార భావఫలాలు

శివనాడీప్రవీణ
పండిత-శ్రీ ద్వివేది.
నారాయణశాస్త్రిగారు-పలూరు.

| జూన్ | జూలై |
|---|---|
| 15 మొదలు | 15 వరకు |

మేషం.—కార్యాలస్యం - లాభవ్యయములు - జనవిరోధము. మనోవైకల్యము. కుటుంబములో చికాకులు.

వృషభం—పైకి లాభమువచ్చినట్లుండునేకాని అనుకున్నంత రాకపోవడం కాక మనస్సుకు యాతన - మిత్రులు శత్రుత్వము వహించుట కడుపులోబాధ - మొత్తముమీద గురుస్థితివల్ల కొంత లాభముండును.

మిధునం—కార్యజయం - సంఘంలో గౌరవం - కీర్తిప్రతిష్ఠలు - దైవారాధన - దైవభక్తి - శుభపరంపరలు - శుభస్వప్నములు. ప్రయాణము - లాభశుభవార్తలు - ధనప్రాప్తి.

కర్కాటకం—విజయప్రాప్తి - ధనలాభం - గౌరవం - సద్గ్రంధ పఠనము - పుణ్యతీర్థసేవనము. సత్సంగము - స్త్రీ లాభము - మిత్రసందర్శనము. శత్రునాశనము.

సింహం—భవిష్యల్లాభసూచనలు - యాదృచ్ఛిక ధనలాభములు, ప్రయాణము - దీర్ఘాలోచనలు హృదయాందోళనము - దైన్యప్రలాపములు, కుటుంబములో కించిదనారోగ్యము - అధైర్యము కోరికకు తగిన ధనము రాకుండుట - చంచలము.

కన్య—శరీరపీడ - లాభధనవ్యయములు మానసికాందోళన - అధైర్యము - కుటుంబములో అస్వస్థత - అపరిమిత వ్యయములు, అనాలోచిత ప్రయాణములు.

---

(73 పేజీ తరువాయి)

లోకం తీరును బోధించేదెవరు ? ఈవోటే మనలను పాలిస్తుంది. ఈవోటేమనకురాజు. ఇట్టిఓటు ఒకఅమూల్యవస్తువు. నోట్లకాసించి ఓట్లను విక్రయించినరాజ్యం పాడౌతుంది కాబట్టి ఓటువిలువ గుర్తించాలి. యీ ఓటును నిజమైన దేశసేవకునకు ధారపోయాలి_అనేవిషయాలు బోధించే మహనీయుడు కావాలి. ఆతడెవడు ? ఉపాధ్యాయుడు. యధార్థం కాదంటారా ? బోధకుడెవడు ? ఉపాధ్యాయుడేకదా ? ఎలాంబోధిస్తాడు? వయోజనవిద్యద్వారా ...

*　　*　　*

నవభారతం నవ్యత్వానికివచ్చి, భారత ప్రజలను భవ్యచరిత్రులుగా జేసి, మన రాజ్యాన్ని రామరాజ్యంగా చేయాలంటే ప్రజలలోనున్న అవిద్యాతిమిరాన్ని పటాపంచలుగా పారద్రోలాలి. అందుకువయోజనవిద్యాభాను డత్యవసరం. అంతటితో సరా? సారధియైన బోధకుడుకావాలి. ఇట్టి ఓటువిలువను బోధించే లోకోద్ధారుడగు బోధకుని వేతనమెంత ? అదియును ఆలోచించవలసిన విషయమే. క్షుద్బాధకు గురియై సుహృద్బోధ చేయగలడా యీ ఉపాధ్యాయుడు ? కావున ఉపాధ్యాయునకువేతనాభివృద్ధిగా వించాలి. భారత రాజ్యాన్ని రామరాజ్యంగా చేయాలి. కల్లబొల్లికబుర్లు కావునగ్నసత్యం !

ఇక సెలవు ! జై భారత్ !

తుల—జ్ఞాతికలహము - మనోవైకల్యము - గృహకలహములు - కుటుంబములో అస్వస్థత - దూరప్రయాణము - విద్యావిషయక కృషి - చంచలచిత్తము - శుభకార్యాలోచనలు - మిత్రులు శత్రుత్వము చూపుట - ధైర్యము - గంభీర భాషణములు.

వృశ్చికము—శుభప్రాప్తి, విద్యాకృషి, ధనలాభము, ప్రయాణములు - ధైర్యము - దైవచింతన, శత్రు జయము - గంభీరాలోచనలు.

ధనుస్సు—మానసికయాతన - యాతనాప్రాప్తి, యాదృచ్ఛిక లాభములు - వ్యయాధిక్యము - అధైర్యము-అస్వస్థత - అతి ఆలోచనలు, ఆరంభ శూరత్వము.

మకరం—శత్రువృద్ధి - బంధుసమాగమము - ప్రయాణములు - నిర్జనస్థల సంచారము - ధైర్యప్రవృత్తి లాభవ్యయములు.

కుంభం—బంధుసమాగమము - ధనలాభము - దూరప్రయాణాలోచనలు - వివిధాలోచనలు - చంచల చిత్తము - దైవచింతన - గుప్త కార్యాలోచనలు - ఉద్యోగ ప్రయత్నములు - భావిశుభధనవస్తు లాభ సూచనలు - వివిధ స్వప్నములు.

మీనం—శరీ రానారోగ్యము - మనోవైకల్యము బంధుజ్ఞాతి విరోధము, కించిద్ధనలాభము, ప్రయాణము-అధైర్యము - ఆలోచనాయానము అతిప్రయాస కార్య సాధనలాభములు.

గురుడు—సిద్ధజాతకరీత్యా ఉల్కావస్థయందుండుటచే వెండి బంగారుధరలు తగ్గినను, శని సంకష్టావస్థయందుంటచే మరల హెచ్చునని సూచన పొడగట్టుచున్నది. అపరదినుసులు - కాయగూరలు ఫలాదులు - కించిన్మూల్యనాధిక్యమూల్యములు కల్గియుండును - శని గురుల అవస్థాసంచారముల వలన ప్రాణికోటికి అనారోగ్యము. హఠాన్మరణములు కల్గుచుండును.

☞ నాడీజ్యోతిష - సిద్ధజాతక శాస్త్రరీత్యా, జాతక - ముహూర్త - వాస్తు - ప్రశ్న విషయములు విశ్వాస భాజనముగా తెలుపబడును - వివరములకు రిప్లై కార్డు, నిలయమునకు వ్రాయుడు—

ఇట్లు
శివనాడీ జ్యోతిర్నిలయమ్,
ఏలూరు - ప॥ గో॥ జిల్లా.






## వేణమ్మపేట :

ఈ గ్రామములోని పరిసర గ్రామములలోని ఉపాధ్యాయులు ది 20-5-51 తేదీన ఈ గ్రామపాఠశాలలో హాజరై ఈదిగువ తీర్మానములను ఏకగ్రీవముగా ఆమోదించిరి.

(1) ప్రతినెల ఏదో ఒక నిర్ణీతదినమునందు ఉపాధ్యాయులు సమావేశమగుటకును (2) బాలబాలికల విద్యాభివృద్ధికొఱకు నిర్బంధ ప్రాథమికవిద్య ప్రవేశపెట్టుటకై ప్రభుత్వము వారిని కోరుటకును (3) బహుమతులిచ్చు పద్ధతిమీద పిల్లలను ఆకర్షించుటకును (4) ఈ గ్రామములో ఒక హయ్యర్ ఎలిమెంటరీ స్కూలును స్థాపించుటకై ప్రభుత్వము వారిని కోరుటకును (5) ప్రతిపాఠశాలకు కనీసము "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" "ప్రారంభవిద్య" "ఉపాధ్యాయ" పత్రికలను తెప్పించుటకున్నూ తీర్మానించిరి.

యం. రంగారావు పట్నాయిక్,
సెక్రెటరీ.

## నిడమఱ్ఱు :

ది 14-5-51 తేదీ సోమవారం సాయంత్రం 5 గం. లకు నిడమఱ్ఱు కేంద్రోపాధ్యాయసంఘ వార్షికోత్సవము, బోర్డు పాఠశాల 56 వ వార్షికోత్సవము, ఈ రేంజి పరీక్షాధికారులైన శ్రీ పాలకోడేడి లక్ష్మీపతి పంతులు బి.యే., బి.యల్., & యల్.టి., గారి అధ్యక్షతక్రింద జరిగెను. విద్యార్థులు విద్యావిషయిక ప్రదర్శనములు జరిపిరి. బుర్రకథ చెప్పబడెను. విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టబడెను.

—దర్భా విశ్వనాథం,
హెడ్మాష్టరు.

## డెల్టా గన్నవరం:

ది 13-5-51 తేదీన రాజోలు తాలూకా టీచరు మేనేజర్సు అండ్ మేనేజర్సు అసోసియేషన్ వర్కింగు కమిటీ మీటింగు జరుపబడి ఈ క్రింది తీర్మానములు కావింపబడెను.

(1) మేనేజిమెంటు గ్రాంటును 15% నుండి 25% పెంచుచు కోతలేకుండ యిప్పించుటకున్ను (2) ప్రావిడెంటు ఫండ్ ను అణానుండి రెండు అణాలకు హెచ్చించుచు అందులోనుండి ఇన్సూరుచేసుకొనే అవకాశమును కల్పించుటకున్ను (3) బాలుర విద్యాపాటవమును పెంపొందించుటకు గాను, ప్రమోషన్ను 60% నుండి 40% నకు తగ్గించుటకున్ను (4) నెలవారీ జీతములను మనీయార్డరు ఖర్చులు లేకుండ బిల్లుల రూపమున పంపుటకున్ను (5) సెంట్రల్ పే కమీషనువారి సూచనల ప్రకారము ఉపాధ్యాయుల జీతములను హెచ్చించుటకున్ను తీర్మానింపబడెను.

—వారణాసి వెంకట సుబ్రహ్మణ్యం,
కార్యదర్శి.

## నాదెళ్ళవారిపాలెము:

ఈ గ్రామములో షుమారు పుష్కరన్నర కాలమునుండి తాత్కాలిక పర్ణశాలలో నడుపబడుచున్న హిందూప్రాథమిక పాఠశాలకు వదాన్యశిరోమణులైన శ్రీ మాటూరు శ్రీరాములు గుప్తగారు 3,000 రూపాయిల విలువగల ఒక భవనమును 2000 చ. గజముల వైశాల్యము గల దానిని దానమొనర్చిరి. భవన ప్రవేశ మహోత్సవము రేపల్లె పశ్చిమరేంజి జూనియర్ విద్యాశాఖాధికారి శ్రీ కె. వెంకట్రామయ్యగారి అధ్యక్షతక్రింద జరిగెను. సభకు చాలమంది పెద్దలు వచ్చిరి. శ్రీ డి. సుబ్రహ్మణ్యకవిగారు విద్యయొక్క విలువను గురించియు శ్రీ కె. భైరవస్వామిగారు గ్రామస్థుల కర్తవ్యమునుగురించియు ముచ్చటించిరి. దాత శ్రీ మాటూరు శ్రీరాములుగారు తామేనాడో సంకల్పించుకొన్న ఈ విద్యాలయ ధర్మము నేటికి నెరవేరినందులకు తమ సంతోషమును వెలిబుచ్చిరి శ్రీ కొలసాని వెంకటస్వామిగారి వందనమునతో సభముగిసెను.

—కస్తూరి భైరవస్వామి,
మేనేజరు.

## సాలూరు:

ఈ గ్రామములోని శ్రీ కూర్మన్నగారి హయ్యర్ ఎలిమెంటరీ స్కూలు మేనేజరు కొట్టక్కి సోమన్న పట్నాయక్‌గారు ది 25-5-51 వ తేది శుక్రవారం వారి స్వగృహమున దివంగతులైరని తెల్పుటకు చాల విచారపడుచున్నాము. వీరి వయస్సు 56 ఏండ్లు వీరు చాలకాలము టీచరు మేనేజరుగా పనిచేసి ఈజిల్లాలో మంచిపేరు ప్రఖ్యాతులు గాంచిరి. వీరిశిష్యులు పెక్కుమందికలరు. భగవంతుడు వీరిపవిత్ర ఆత్మకు శాంతిని ప్రసాదించుగాక.

## అమలాపురం:

తూర్పుగోదావరి జిల్లా టీచర్సు గిల్డురాష్ట్రఫెడరేషను కార్యదర్శి శ్రీ ఏ. యల్. నారాయణరావు గారి అధ్యక్షతక్రింద ది 8-5-51 తేదీ మధ్యాహ్నము 1 గంటనుండి జరిగినది. కార్యదర్శి నివేదిక ఆమోదింపబడెను. క్రిందటి సంవత్సరము కార్యవర్గమే ఈ ఏడుకూడా పనిచేయుటకు తీర్మానింపబడెను. రామా అండ్ కో వారు (ఏలూరు) తమ పాఠ్యగ్రంథములను ప్రదర్శించిరి.

—కె. సోమేశ్వరరావు,
మేనేజరు.

## అమలాపురం:

ఆంధ్రరాష్ట్ర ఉపాధ్యాయ ఫెడరేషను 12 వ వార్షికోత్సవము శ్రీ తనికెళ్ల వీరభద్రుడు, యం. ఏ. ప్రొఫెసరు, హైదరాబాదు పబ్లికు సర్వీసు కమీషను సభ్యులు అధ్యక్షతను యీనెల 9 వ తేదీని బోర్డు హైస్కూలు, అమలాపురమునందు ఉదయం గం. 8 లకు ప్రారంభింపబడెను. ప్రసిద్ధ న్యాయవాదులును, ఆహ్వాన సంఘాధ్యక్షులును, అగు శ్రీ దువ్వూరి కృష్ణారావుగారు సభ్యులకు స్వాగతము చెప్పిరి. విద్యా విధానమునందలి మంచి చెడ్డలను స్థాలీపులాక న్యాయముగా విమర్శించిరి. అధ్యక్షులు తమ ఉపన్యాసమును చదివిరి. కార్యదర్శి రిపోర్టు చదువబడి ఆమోదింపబడెను. వివిధబోధనాంశములపై సెక్షనల్ కాన్ఫరెన్సులు జరిగి తీర్మానములు చేయబడెను. గత సంవత్సరము జరిగిన విద్యావిషయక వస్తుప్రదర్శనములో పాల్గొన్న వారికి రజితపాత్రలు, ప్రశంసా పత్రములు, యివ్వబడెను. 6 జిల్లాలనుండి ప్రతినిధులు వచ్చి సభలో పాల్గొనిరి. ఫెడరేషనును ప్రభుత్వము గుర్తింపవలెననియు, కేంద్రప్రభుత్వ వేతన నిర్ణాయక సంఘము నిర్ణయించిన స్కేళ్లను యివ్వవలెననియు, మున్నగు తీర్మానములు చర్చింపబడి ఆమోదింపబడెను.

రామా అండ్ కో., (ఏలూరు) వారు, ఇతర పుస్తక ప్రకటనకర్తలు, సమావేశమును శోభాయమానమొనర్చిరి.

గత సం॥రం కార్యవర్గమే తిరిగి పనిచేయుటకు రాత్రి గం. 11-45 లకు తీర్మానించుటచే కార్యక్రమము ముగింపబడెను.

ఆహ్వాన సంఘమువారు సభ్యులకు, డెలిగేట్లకు; 8, 9 తేదీలు రెండు రోజులు భరద్వాజవిందుచేసిరి.

—కె. సోమేశ్వరరావు,
మేనేజరు.

## శ్రీ గజపతినగర కేంద్రోపాధ్యాయ సంఘ ద్వితీయ వార్షికోత్సవము

విశాఖపట్నం ఉర్దూరేంజీకి చెందిన గజపతినగర కేంద్రప్రాథమికోపాధ్యాయసంఘముయొక్క ద్వితీయ వార్షికోత్సవము 12-5-51 వ తేదీన మెంటాడ గ్రామములో విశాఖజిల్లాబోర్డు అధ్యక్షులగు శ్రీ గొట్టిపాటి బుచ్చి అప్పారావుగారి అధ్యక్షతక్రింద అతిజయప్రదముగా జరిగినది. శ్రీ పసుమర్తి వీరభద్రస్వామిగారు, B. A., M. L. C. జాతీయపతాకమును ఎగురవేసిరి. శ్రీ కిళాంబి రంగాచార్యులుగారు, M. A., B. L., విద్యావిషయక వస్తుప్రదర్శనమును తెరచిరి. శ్రీ నారాయణం వెంకటచెలమాజీగారు, M. L. C. బోర్డువిద్యాధికారి, విశాఖరేంజి విద్యాధికారులు, పరిసరజిల్లాబోర్డు మెంబర్లు సుమారు నూరుమంది యితరపెద్దలు, సభకు హాజరైరి.

మెంటాడ పంచాయితీబోర్డు ప్రెశిడెంటుగారగు శ్రీ ముప్పిడి కృష్ణమూర్తి శ్రేష్ఠిగారు ఉపాధ్యాయులకు, అతిథులకు అతిచక్కని వసతి, భోజనపు యేర్పాట్లు గావించిరి.

ఉపాధ్యాయులు తమ వినతిపత్రములలో జీతములు, కరువుబత్తెములు, హెచ్చుచేయవలసినదనిన్ని, నిర్బంధవిద్య అన్నిప్రాంతములలో అమలుచేయవలయుననిన్ని, నెలవారీజీతములు నెలతప్పకుండా జారీచేయించుచుండవలెననిన్ని, జిల్లాబోర్డువారు బిల్డింగులు, ఉపకరణములు, విషయములో ఎక్కువ శ్రద్ధ చూపవలసినదనిన్ని కోరిరి. గ్రామస్థులతరఫున శ్రీ పిట్టాడ చిట్టిబాబుగారు గజపతినగరములో ఒక హైస్కూలు త్వరలో స్థాపించవలయుననిన్ని, మెంటాడ హాస్పిటలునకు ఒక మంత్రసానిని యిప్పించవలసినదనిన్ని కోరిరి.

జిల్లాబోర్డు ప్రెశిడెంటుగారు తమ ఉపన్యాసములో ఉపాధ్యాయుల కోరికలు సమంజసముగనున్నందున వాటిని నెరవేర్చుటకు తాము తగినంత సహాయము చేయుదుమనియును, కాంగ్రెసు గవర్నమెంటునకు రాగానే పెక్కుచిక్కుసమస్యలను, గడ్డుపరిస్థితులను, ఎదుర్కొనవలసివచ్చినదనియును ప్రజలు గవర్నమెంటునకు పూర్తిసహాకారము చేయవలయుననియును, గజపతినగరములో హైస్కూలు స్థాపించుటకును, మెంటాడలో మంత్రసానిని నియమించుటకును, వెంటనే యేర్పాటు చేయుచున్నామనియును, సెలవిచ్చిరి.

ఉపాధ్యాయులతో పోటలు, నాటకములు వగయిరాలు జరిగినతరువాత శ్రీ నారాయణం వెంకటచెలమాజీగారు, M.L.C. బహుమతులను పంచుచు, దేశాభివృద్ధియంతయు ప్రాథకోపాధ్యాయుల చేతులయందేయున్నదనియును, ఉపాధ్యాయులు పిల్లలను దేశాభిమానులుగను, శూరులుగను. సత్యసంధులుగను, తయారుచేయవలయునని ఉద్బోధించిరి.

ఉర్దూ రేంజి డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారగు శ్రీ శ్రీ రామమూర్తిగారి ధన్యవాదములతో గజపతినగర బోర్డుపాఠశాల బాలికల మంగళగీతములతో, సభ జయప్రదముగ ముగిసెను.

(Authorised version)

D. RAMAMURTY,
14-5-51, Deputy Inspector of Schools,
Viskhapatnam Urdu Range

## ఏలూరు :

జిల్లాలోని ఎలిమెంటరీ పాఠశాలలలో పనిచేయు ఉపాధ్యాయులకు Craft qualification కలుగజేయునిమిత్తం ఏలూరు రెడ్‌క్రాస్ బ్రాంచివారి ఆధ్వర్యమున ఈ పట్టణమున జూనియర్ రెడ్‌క్రాస్ కౌన్సిలర్ల ట్రైనింగు 1-6-51 మొదలు 6-6-51 వరకు జరుపబడెను. జిల్లాలోని వివిధప్రాంతములనుండి 140 మంది ఉపాధ్యాయులు శిక్షణపొందిరి. మొదటిదినం ప్రారంభోత్సవమునకు పశ్చిమగోదావరిజిల్లా విద్యాశాఖాధికారి శ్రీ కె. వీరభద్రస్వామిగారు అధ్యక్షతవహించిరి. జిల్లాకలెక్టరు J. P. L. గ్విన్ I. C. S. గారు ప్రారంభోపన్యాసమునిచ్చిరి. రెడ్‌క్రాస్ సొసైటీ ఏలూరుశాఖ గౌరవకార్యదర్శి శ్రీ P. L. నారాయణ B.A.,B.L., గారు రెడ్‌క్రాస్‌యొక్క చరిత్ర, దాని లక్ష్యములు, ఆదర్శములనుగూర్చి ఉపన్యసించిరి. ప్రతిదినము ఉదయమున ప్రముఖులచే రెడ్‌క్రాస్‌యొక్క పనులు, ఆరోగ్యము, వ్యాధులు, వానినివారణ మొదలగు అంశములపై ఉపన్యాసములు యివ్వబడెను.

ఏలూరు ఈస్టురేంజి డిప్యూటీ ఇన్‌స్పెక్టరు శ్రీ M.V.N. శేషాచార్యులుగారు రెడ్‌క్రాసుయొక్క పనిని సిలబస్‌లోని వివిధ అంశములతో సమన్వయపరచుటనుగూర్చి ఉపన్యసించిరి. ప్రతిదినము సాయంత్రం బైండింగుపని నేర్పబడెను. ఆఖరురోజున విద్యార్థులుచేసిన పనిని విద్యాశాఖాధికారిగారగు శ్రీ K. వీరభద్రస్వామిగారు తణిఖీచేసి హితవాక్యములు చెప్పిరి. ఏలూరు వెస్టురేంజి డిప్యూటీ యిన్‌స్పెక్టరుగారగు శ్రీ K. వెంకటేశ్వర్లుగారి వందనములతో శిక్షణ సమాప్తము చేయబడెను.

8—6—51
ఏలూరు.

ఎ. వి. రాఘవాచార్యులు,
అటెండెన్సు ఆఫీసరు.

## నిడదవోలు :

ది 14—4—51 తేదీ నిడదవోలు కేంద్రోపాధ్యాయ సంఘసమావేశ సందర్భమున శ్రీ కొవ్వూరు రేంజి స్కూళ్ళ సీనియరు డిప్యూటీ యిన్‌స్పెక్టరుగారైన R. రామన్నారావు పంతులుగారు అధ్యక్షతక్రింద శ్రీ పి. వి. చలపతిరావు J. D. I. గారికి వీడ్కోలు సన్మానము జరుపబడెను. శ్రీ చివుకుల రామశేషయ్యగారు ఉత్సాహపూరితమైన ఉపన్యాసమొసంగిరి. తదుపరి పలువురు ఉపన్యసించిరి. శ్రీ జోస్యుల సూర్యనారాయణగారి అభివందనములతో సభ ముగింపబడెను.

నిడదవోలు
12—6—51.

సెంటరు సెక్రటరీ
R. సూర్యనారాయణ.



# మే నె ల చి త్ర ప్ర శ్న లు

(1951 సం॥ మే నెల సంచికలో ప్రకటింపబడిన)

## వి వే క ప్ర శ్న లు

అను చిత్రప్రశ్నలకు సమాధానములు.

౧. కాపురము. ౨. భారతి.

* * *

చందా నెం. రెండు ప్రశ్నలకు సరియైన సమాధానములు పంపినవారు.

478 డా॥ చక్రాల తిరుపతిరాజుగారు - రామచంద్రపురం.
160 చింతాడ రాములుగారు - టీచరు - రామదాసుపేట
569 కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు - మొయిద.
14 రేగిడి సత్యనారాయణగారు - మేనేజరు - కోటిపాం
402 రేగులవల్స సత్యనారాయణ పట్నాయక్‌గారు - మేనేజరు - గాంధాజీ చీపురుపల్లి
155 జి. నాగన్నగారు - హెడ్మాష్టరు - రంగాపురం
202 భోగాపురపు సీతారామస్వామిగారు - హెడ్మాష్టరు - కొట్టిశ.
484 కె. రామన్నగారు - రిటైర్డుటీచరు - కోడుమూరు
382 సి. హెచ్. వెంకట్రామయ్యగారు - మేనేజరు - కుంచేపల్లి
96 ఆర్. సుబ్రహ్మణ్యంగారు - టీచరు - గంగలకుర్తి అగ్రహారం
345 బి. నరసయ్యగారు - సెక్రటరి - రైల్వే కోడూరు
గుండేపూడి హనుమంతరావుగారు - శనివారప్పేట - ఏలూరు.
277 S. రామానుజాచార్యులు, టీచరుమేనేజరు, పిల్లంక
374 యస్. కె. డి. ప్రసాదలింగంగారు-హెడ్మాష్టరు-దుగ్గిరాల
68 మూనగవలస రంగారావు పట్నాయక్‌గారు-టీచరు-వేణుగ్మపేట
220 మునగవలస భాస్కరరావుగారు-స్టేషనుమాస్టా-చింగువారా
264 కాసిన ఆదినారాయణ-విద్యార్థి-గరులియా-పశ్చిమబెంగాల్
55 పి. సూర్యనారాయణ పట్నాయక్‌గారు-చింతపల్లిపేట
10 పి. నైనాచార్యులుగారు-హెడ్మాష్టరు-వైకుంఠలక్ష్మీపురం.
586 తమిరి సత్యనారాయణరావుగారు-హెడ్మాష్టరు-రామన్నగూడెం
868 అల్లంరాజు సూర్యారావుగారు-హెడ్మాష్టరు-శృంగవరము
455 అల్లంరాజు బంగారంగారు-(S. D.) శంఖవరము
575 టి. రాజగోపాలరావు పట్నాయక్‌గారు-హెడ్మాష్టరు-పనసపెద్ది కోనవలస
486 ముత్యం గణేశ్వరరావుగారు-హెడ్మాష్టరు-కలిగోట్ల
157 తిరివీధి వెంకటేశ్వర్లుగారు-రాజంపల్లె
90 రుద్రాభట్ల వేంకట భాస్కరరావుగారు-చాపర
362 సన్నిధి సత్యనారాయణగారు-టీచరు-రాచపల్లి
349 యం. శ్రీరాములుగారు - దేవరాయపల్లి
439 కణితి కాశునాయుడు - విద్యార్థి - పెద్దపువానిపేట
షేక్ అబ్దుల్ రహిమాన్‌సాహెబు - విద్యార్థి - మునుగోడు